# సంస్కృత వ్యవహార సాహస్రీ

ప్రకాశికా
**సంస్కృత భారతీ** (పూర్వాంధ్రప్రదేశః)
23-23-30, శివరావువీధీ, సత్యనారాయణపురం,
విజయవాడ - 520 011.

ప్రకాశికా
సంస్కృత భారతీ
23-23-30, శివరావువీథి, సత్యనారాయణపురం,
విజయవాడ - 520011.

ప్రచార విరాళము (ద్వాదశ రూప్యకాణి) రూ. 12/-

ప్రకాశకస్య ఏవ
ప్రథమ ముద్రణా : ద్వి సహస్రం

ప్రతులకు
సంస్కృత భారతీ
23-23-30, శివరావువీథి, సత్యనారాయణపురం,
విజయవాడ - 520011.

## దయచేసి ఈ విషయాలు గమనించండి.

1. మీ ఇంట్లో సంస్కృతం నేర్చుకోవటానికి ఉపయోగించే పుస్తకాలు ఒకటైనా ఉండాలి.
2. ప్రతి రోజు సంస్కృతంలో ఒక వాక్యం నేర్చుకోండి.
3. పిల్లలందరూ సంస్కృతం నేర్చుకునేలా ప్రోత్సహించండి.
4. మీకు పరిచయమున్న విద్యాలయాల్లో సంస్కృతం నేర్పించే ఏర్పాటు చేయించండి.
5. సంభాషణలో సంస్కృతం ఉపయోగించవలసిన అవసరం తెలియ చేయండి.
6. సంస్కృతం మాట్లాడేవారిని ప్రోత్సహించి, అభినందించండి.
7. బహుమతులు ఇవ్వవలసివస్తే సంస్కృత పుస్తకాలనే బహుమతులుగా ఇవ్వండి.
8. శుభాకాంక్షలు సంస్కృతంలోనే పంపండి.
9. ఆహ్వాన పత్రికలు సులభ సంస్కృతంలో ముద్రించండి.
10. సంస్కృత ప్రచారానికి మీ సమయాన్ని వినియోగించండి.
11. సాయంకాలం సమయాల్లో సంస్కృతం పాఠాలు జరిగే ఏర్పాట్లు చేయండి.
12. సంస్కృతం మన సాంస్కృతిక భాష అనే విషయం ప్రచారం చేయండి.
13. ఇళ్ళల్లో, కార్యాలయాల్లో సంస్కృత వ్యవహార వాక్యాలను వ్రాసి పెట్టండి.

14. సంస్కృతంలో మాట్లాడగలగడం గర్వకారణమని తెలుసుకొనే వాతావరణం కల్పించండి.

15. సంస్కృత ప్రచార కార్యానికి ధన సహాయం చేయండి.

16. సంస్కృత ప్రచారానికి స్ఫూర్తినిచ్చే పోస్టర్లు, స్టిక్కర్స్ తయారు చేయండి.

17. ఫోనులో 'హలో' కి బదులు 'హరిఃఓం', 'జయ శ్రీరామ్', 'నమస్కార్' అని చెప్పండి.

18. మీ మీ మాతృ భాషలు మాట్లాడేటప్పుడు ఇంగ్లీషు శబ్దాలకి బదులుగా సంస్కృత శబ్దాలనే వాడండి.మన నిత్య జీవితంలో (జీవనంలో) వాడే ఎన్నో ఆంగ్లపదాలకు బదులు సంస్కృతం వాడడం వల్ల విదేశీవాసనను త్యజించగలుగుతాం.

19. 'సంభాషణ-సందేశః' అను సంస్కృత మాసపత్రికకు చందాదారులుగా చేరండి. (సంవత్సర చందా : రూ.110 – 'అక్షరమ్', గిరినగరం, బెంగుళూరు - 85 వారిముద్రణ)

20. మీ సహాయ సహకారాలతో జరిగే ప్రతి కార్యక్రమంలో ఈ సంవత్సరములో సంస్కృత కార్యక్రమం తప్పనిసరిగా ఉండేటట్లు చూడండి.

21. పత్రాలయ ద్వారా సంస్కృతం నేర్చుకొనుటకు చిరునామా :
పత్రాలయద్వారా సంస్కృతమ్ (ఇంగ్లీషు/కన్నడ మాధ్యమం)
అక్షరమ్,8వక్రాస్-ఫేజ్2, గిరినగరమ్, బెంగుళూరు-560 085


**పత్రాలయ సంస్కృతమ్ (తెలుగు మాధ్యమం)**

**ఉపద్రష్ట వేంకట కృష్ణయ్య**

23-23-30, శివరావువీధి, సత్యనారాయణపురం,

విజయవాడ - 520011.

# సంస్కృత భారతీ

## ప్రార్థన

పఠామి సంస్కృతమ్ నిత్యమ్
వదామి సంస్కృతమ్ సదా
ధ్యాయామి సస్కృతమ్ సమ్యక్
వందే సంస్కృత మాతరమ్

సంస్కృతస్య ప్రసారాయ
నైజమ్ సర్వమ్ దదామ్యహమ్
సంస్కృతస్య సదాభక్తో
వందే సంస్కృత మాతరమ్

సంస్కృతస్యయ కృతే జీవన్
సంస్కృతస్య కృతే యజన్
ఆత్మాన మాహుతమ్ మన్యే
వందే సంస్కృత మాతరమ్

వాక్యకారం వరరుచిమ్ భాష్యకారం పతంజలిమ్
పాణినిమ్ సూత్రకారంచ ప్రణతోస్మి మునిత్రయం

# భారతభూషా సంస్కృతభాషా

భారతభూషా సంస్కృతభాషా విలసతు హృదయే హృదయే
సంస్కృతిరక్షా రాష్ట్రసమృద్ధిః భవతు హి భారతదేశే || భారత ||

శ్రద్ధా మహతీ నిష్ఠా సుదృఢా స్యాన్నః కార్యరతానాం
స్వచ్ఛా వృత్తిర్నవ ఉత్సాహో యత్నో వినా విరామం
న హి విచ్ఛిత్తిశ్చిత్తవికారః పదం నిదధ్మస్సతతం
సత్యపి కష్టే విపది కదాపి వయం న యామో విరతిమ్ || భారత ||

శ్వాసే శ్వాసే రోమసు ధమనిషు సంస్కృతవీణాక్వణనం
చేతో వాణీ ప్రాణః కాయః సంస్కృతహితాయ నియతం
శ్వసిమి ప్రాణిమి సంస్కృతవృద్ధ్యై నమామి సంస్కృతవాణీం
పుష్టిస్తుష్టిస్సంస్కృతవాక్తః తస్మాద్భృతే న కించిత్ || భారత ||

నాహం యాచే హారం మానం న చాపి గౌరవవృద్ధిం
నో సత్కారం విత్తం పదవీం భౌతికలాభం కంచిత్
యస్మిన్ దివసే సంస్కృతభాషా విలసేజ్జగతి సమగ్రే
భవ్యం తన్మహదద్భుతదృశ్యం కాంక్షే వీక్షితుమాశు || భారత ||

విషయసూచీ

# సంస్కృత వ్యవహారసాహస్రీ

# సంస్కృత - వ్యవహారసాహస్రీ

## శిష్టాచారః - శిష్టాచారము

| | |
|---|---|
| హరిః ఓమ్ | హలో |
| సుప్రభాతమ్ / నమస్తే/నమస్కారః | శుభోదయం/నమస్తే /నమస్కారం |
| శుభరాత్రిః | శుభరాత్రి |
| ధన్యవాధః | ధన్యవాదం |
| స్వాగతమ్ | స్వాగతం |
| క్షమ్యతామ్ | క్షమించండి |
| చింతా మాస్తు | పరవాలేదు |
| కృపయా | దయచేసి |
| పునః మిలామః | మళ్ళీ కలుద్దాం |
| అస్తు | అలాగే |
| శ్రీమన్ | అయ్యా! |
| మాన్యే/ఆర్యే | అమ్మా! |
| సాధు సాధు/సమీచీనమ్ | బాగుంది |

## మేలనమ్ - ఒకరినొకరు కలిసినపుడు

| | |
|---|---|
| భవతః నామకిమ్ ? | నీ (మీ) పేరేమి ?(పుం) |
| భవత్యాః నామ కిమ్ ? | నీ (మీ) పేరేమి ? (స్త్రీ) |
| మమ నామ“ ..........” | నా పేరు “..........” |

| | |
|---|---|
| ఏషః మమ మిత్రం "........." | ఇతడు నా స్నేహితుడు "......" |
| ఏతేషాం విషయే శ్రుతవాన్ | వీరిని గురించి విన్నాను |
| ఏషా మమ సఖీ '.......' | ఈమె నా స్నేహితురాలు '....' |
| భవాన్ కిమ్ (ఉద్యోగం) కరోతి ? (పుం) | నీవు ఏమి (ఉద్యోగం) చేయుచున్నావు |
| భవతీ కిమ్ (ఉద్యోగం)కరోతి ?(స్త్రీ) | నీవు(మీరు) ఏమిచేయుచున్నారు? |
| అహం అధ్యాపకః అస్మి (పుం) | నేను ఉపాధ్యాయుడను |
| అహం అధ్యాపికా అస్మి (స్త్రీ) | నేను ఉపాధ్యాయినిని |

| | | | |
|---|---|---|---|
| అధికారీ(రిన్) | అధికారి | ఉట్టంకకః | టైపిస్టు |
| తంత్రజ్ఞః | ఇంజనీరు | ప్రాధ్యాపకః | ప్రొఫెసర్ |
| లిపికః | గుమాస్తా | న్యాయవాది(దిన్) | న్యాయవాది |
| విక్రయికః | అమ్మువాడు | ఉపన్యాసకః | లెక్చరర్ |

| | |
|---|---|
| అహం యంత్రాగారే కార్యం కరోమి | నేను యంత్రాగారంలో పని చేస్తున్నాను. |

| | | | |
|---|---|---|---|
| కార్యాలయే | కార్యాలయంలో | మహావిద్యాలయే | కళాశాలలో |
| విత్తకోశే | బ్యాంక్‌లో | చికిత్సాలయే | ఆస్పత్రిలో |
| ప్రౌఢశాలాయాం | హైస్కూల్‌లో | ఆపణే | దుకాణంలో |

| | |
|---|---|
| భవాన్ / భవతీ కస్యాం కక్ష్యాయాం పఠతి ? | నీవు ఏ తరగతిలో చదువుతున్నావు ? |

| | |
|---|---|
| అహం నవమ కక్ష్యాయాం పఠామి | నేను 9వ తరగతి చదువుచున్నాను |
| అహం I II III B.Sc., కక్ష్యాయాం పఠామి | నేను I II III B.Sc., చదువుచున్నాను. |
| భవతః గ్రామః ? | నీది ఏ ఊరు? |
| మమ గ్రామః '........' | నా ఊరు '.......' |
| కుశలం వా ? | కుశలమా ? / క్షేమమా? |
| కథమస్తి భవాన్ ? | నీవు ఎలావున్నావు ? (క్షేమమేనా) |
| గృహే సర్వే కుశలినః వా ? | ఇంట్లో అంతా బాగున్నారా ? |
| సర్వం కుశలం | అంతా బాగున్నారు |
| కః విశేషః / కా వార్తా ? | ఏమిటి విశేషాలు ? / ఏమి వార్త? |
| భవతా ఏవ వక్తవ్యమ్ | నీవే చెప్పాలి |
| కో ఽపి విశేషః ? | ఏమైనా ప్రత్యేక విషయం ఉన్నదా ? |
| భవాన్ / భవతీ కుతః ఆగచ్ఛతి ? | నీవు ఎక్కడి నుండి వస్తున్నావు ? |
| అహం శాలాతః | నేను పాఠశాల నుండి |
| గృహాతః | ఇంటి నుండి |
| ......... తః | ............ నుండి వస్తున్నాను |
| భవాన్ / భవతీ కుత్ర గచ్ఛతి ? | నీవు ఎక్కడికి వెళ్ళుచున్నావు ? |
| తథా భవతి వా ఇతి పశ్యామః ? | అలా అవుతుందేమో చూద్దాం |
| జ్ఞాతం వా | తెలిసినదా ? |
| కథం అసీత్ ? | ఎలా ఉండినది ? |
| అంగీకృతం కిల ? | సరేనా ? |

| | |
|---|---|
| కతి అపేక్షితాని ? | ఎన్ని కావాలి ? |
| అద్య ఏవ వా? | ఈ రోజేనా ? |
| ఇదానీం ఏవ వా ? | ఇప్పుడేనా ? |
| ఆగంతవ్యం భోః | రండి ! |
| తదర్థం వా ? | అందుకా ? |
| తత్ కిమపి మాస్తు | అదేమీ వద్దు |
| న దృశ్యతే కిమ్ ? | కనపడటం లేదా ? (చూడటం లేదా) |
| సమాప్తం వా ? | అయినదా? |
| కస్మిన్ సమయే ? | ఎప్పుడు ? ఏ సమయంలో? |
| తథాపి .......... | అయినా / అయినప్పటికి |
| ఆవశ్యకం న ఆసీత్ | అక్కర్లేకపోయినది |
| తిష్ఠతు భోః | మరి కొంచెంసేపు ఉండు |
| స్మరతి కిల? | జ్ఞాపకం ఉన్నది కదా ? |
| తథా కిమపి నాస్తి | అలా ఎంతమాత్రం కాదు |
| కథమ్ అస్తి భవాన్ ? | నీ వెలా ఉన్నావు ? |
| మా విస్మరతు | మర్చిపోవద్దు |
| అన్యచ్చ............. | ఇంకా ...... |
| తదనంతరమ్ | తర్వాత |
| తావదేవ కిల ? | అంతే కదా? |
| మహాన్ సంతోషః | చాల సంతోషం. |
| తత్ తథా న | అది అలా కాదు. |

| | |
|---|---|
| తస్య కః అర్థః | దాని అర్థం ఏమిటి ? |
| ఆమ్ భోః | అవునయ్యా / అవునండి |
| ఏవమేవ | అలాగే |

అహం { దేవాలయం / కార్యాలయం / విపణీం } గచ్ఛామి

నేను { దేవాలయానికి / కార్యాలయానికి / బజారుకు } వెళ్ళుచున్నాను

| | |
|---|---|
| కిం చిరాద్దర్శనం ? | చూచి చాలా కాలమైంది |
| భవంతం కుత్రాపి దృష్టవాన్ | నిన్ను ఎక్కడో చూచాను |
| భవాన్ సంభాషణ శిబిరం ఆగతవాన్ వా? | నీవు సంభాషణ శిబిరానికి వచ్చావా ? |
| తర్హి కుత్ర దృష్టవాన్ ? | మరి ఎక్కడ చూచాను ? |

## సరళ వాక్యాని — సరళ వాక్యాలు

| | |
|---|---|
| తథైవ అస్తు | అలాగే కానీ |
| జానామి భోః | నాకు తెలుసును |
| ఆమ్ తత్ సత్యం | అవును. అది నిజం |
| సమీచీనా సూచనా | చక్కని సలహా |
| కించిత్ ఏవ | కొంచెమే |

| | |
|---|---|
| కిమర్థం తద్ న భవతి ? | అది ఎందుకు కాదు ? |
| భవతు నామ | సరే కానీ / పోనీ |
| ఓహో తథా వా ? | ఓహో! అలాగా ! |
| ఏవమపి అస్తి వా | అలా కూడా ఉన్నదా ? |
| అథ కిమ్ ? | తర్వాత? |
| నైవ కిల ? | కాదు కదా ? |
| భవతు | సరే, కానీ |
| ఆగచ్ఛంతు | రండి, దయచేయండి |
| ఉపవిశంతు | కూర్చోండి |
| సర్వథా మాస్తు | వద్దేవద్దు |
| కిమ్ ఆనయంతి | ఏమి తెస్తారు ? |
| అస్తు వా ? | సరేనా |
| కిమర్థం భోః ? | ఎందుకని ? |
| ప్రాప్తం కిల ? | దొరికినది కదా ? |

## సామాన్య వాక్యాని / సామాన్య వాక్యాలు

| | |
|---|---|
| ప్రయత్నం కరోమి | ప్రయత్నిస్తాను |
| న శక్యతే భోః | సాధ్యం కాదయ్యా |
| తథా న వదతు | అలా అనకు |
| తత్ర కోఽపి సందేహః నాస్తి | అక్కడ సందేహమే లేదు |
| తత్ అహం న జ్ఞాతవాన్ | అది నేను తెలుసుకొనలేకపోయాను |

| | |
|---|---|
| భవాన్ / సః / సా / కదా దదాతి | ఎప్పుడు ఇస్తావు? ఇస్తాడు/ఇస్తుంది? |
| అహం కథం వదామి"కదా ఇతి" | 'ఎప్పుడు' అని నేను ఎలా చెప్పగలను? |
| తథా భవతి వా ? | అలా అవుతుందా ? |
| భవతః సమయావకాశః అస్తివా ? | మీకు సమయావకాశం ఉందా ? |
| అద్య భవతః కార్యక్రమః కః ? | ఈ రోజు మీ కార్యక్రమం ఏమిటి ? |
| అరే పాదస్య / హస్తస్య కిం అభవత్ | అరే కాలికి / చేతికి ఏమయింది ? |
| బహుదినేభ్యః తే పరిచితాః | వాడు చాలా కాలంగా తెలుసు |
| తస్య కియద్ ధైర్యం ? | అతడికి ఎంత ధైర్యం ? |
| భవాన్ న ఉక్తవాన్ ఏవ | నీవు చెప్పనే లేదు ? |
| అహం కిం కిరోమి ? | నేనేం చేయను ? |
| యథా భవాన్ ఇచ్ఛతి తథా | మీ యిష్ట ప్రకారమే |
| భవతు, చింతాం న కరోతు | పోనీ, బాధపడకు / ఫరవాలేదు |
| తేన కిమపి న సిధ్యతి | అతని / దానివలన ఏమి ప్రయోజనంలేదు |
| సః సర్వథా అప్రయోజకః | అతడు అన్ని విధాల అప్రయోజకుడు |
| పునరపి ఏకవారం ప్రయత్నం కుర్మః | మరొకసారి ప్రయత్నం చేద్దాం |
| మౌన మేవ ఉచితమ్ | మౌనమే మంచిది |
| తత్ర అహం కిమపి న వదామి | అక్కడ / ఆ విషయంలో నేనేమి మాట్లాడను |

| | |
|---|---|
| తర్హి సమీచీనమ్ | అలా అయితే మంచిది |
| ఏవం చేత్ కథమ్ ? | ఇలా అయితే ఎలా ? |
| మాం కించిత్ స్మారయతు | నాకు కొంచెం జ్ఞాపకం చేయండి |
| తం అహం సమ్యక్ జానామి | నేను అతనిని బాగుగా ఎరుగుదును |
| తదానీ మేవ ఉక్తవాన్ కిల ? | అప్పుడే చెప్పినాను/చెప్పినాడు/ చెప్పినావు కదా? |
| కదా ఉక్తవాన్ భోః ? | ఎప్పుడు చెప్పినావు / చెప్పినాడు? |
| యత్కిమపి భవతు | ఏమైతే అదేకానీ |
| సః బహు సమీచీనః | అతడు చాలా ఉత్తముడు |
| సః బహు రూక్షః | అతడు చాలా తీవ్రస్వభావుడు |
| తద్విషయే చింతా మాస్తు | ఆ విషయంలో బాధపడకు / ఆలోచించకు |
| తథైవ ఇతి న నియమః | అది అంతే అని ఏమీలేదు |
| కర్తుం శక్యం కించిత్ | చేయటం సాధ్యమే, |
| సమయః అపేక్ష్యతే | కొంత సమయం కావాలి |
| ఏతావత్ అపి కృతవాన్ | ఇంత అయినా చేసినాడు |
| ద్రష్టుం ఏవ న శక్యతే | చూచుటకే సాధ్యం కాదు |
| తత్రైవ కుత్రాపి స్యాత్ | అది అక్కడనే ఎక్కడో ఉంటుంది |
| యథార్థం వదామి | నిజం చెపుతున్నాను |
| ఏవం భవితుం అర్హతి | అలా కావచ్చును / అలాగే |

| | |
|---|---|
| కదాచిత్ ఏవమపి స్యాత్ | అప్పుడప్పుడు అలాగకూడ కావచ్చును |
| అహం తావదపి న జానామివా? | నాకు అమాత్రం తెలియదా ? |
| తత్ర గత్వా కిం కరోతి ? | అక్కడకు వెళ్ళి ఏమి చేయుదువు ? |
| పునః కిమపి క్లేశః నాస్తి | మళ్ళీ ఏమీ ఇబ్బంది లేదు |
| ఏతత్ కష్టం న | ఇది కష్టం కాదు |
| భోః ఆనీతం వా | ఏమండీ ! తెచ్చినారా |
| భవతః కృతే కః ఉక్తవాన్ | నీ గురించి ఎవరు చెప్పినారు |
| కించిదనంతరం ఆగచ్ఛేత్ | కొంచెం తర్వాత కాకపోవచ్చును |
| ప్రాయః తథా న స్యాత్ | బహుశః అలాగ కాకపోవచ్చును |
| చింతా మాస్తు, శ్వః దదాతు | పరవాలేదు, రేపు ఇయ్యి |
| అహం పునః సూచయామి | నేను మళ్ళీ తెలుపుతాను |
| అద్య ఆసీత్ వా ? | ఈ రోజు ఉండినదా ? |
| అవశ్యం ఆగచ్ఛామి | తప్పక వస్తాను |
| నాగరాజః అస్తి వా ? | నాగరాజు ఉన్నాడా ? |
| కిమర్థం తత్ ఏవం అభవత్ ? | అది అలాగ ఎందుకు అయింది ? |
| తత్ర ఆసీత్ వా ? | అక్కడ ఉండినదా? |
| కిమపి ఉక్తవాన్ వా ? | ఏమైనా చెప్పారా ? |
| కుతః అనీతవాన్ ? | ఎక్కడ నుండి తెచ్చినావు ? |
| అన్యత్ కార్యం కిమపి నాస్తి | వేరే పని ఏమీ లేదు |

| | |
|---|---|
| మమ వచనం శృణోతు | నా మాట విను |
| ఏతత్ సత్యం కిల ? | అది నిజమే కదా ? |
| తద్ అహం అపి జానామి | అది నాకు కూడా తెలుసు |
| తావద్ అవశ్యకం న | అంతగా అక్కర్లేదు |
| భవతః కా హానిః ? | మీకేమి నష్టం? |
| కిమర్థం ఏతావాన్ విలంబః ? | ఎందుకు ఇంత ఆలస్యం ? |
| యథేష్టమ్ పర్యాప్తం అస్తి | కావలసినంత ఉంది |
| భవతః అభిప్రాయః కః ? | మీ అభిప్రాయం ఏమిటి ? |
| అస్య కిం కారణం ? | ఇందుకు కారణం ఏమిటి ? |
| స్వయమేవ కరోతి వా ? | స్వయంగా చేస్తారా ? |
| తత్ న రోచతే | అది ఇష్టం లేదు |
| ఉక్తం ఏవ సః వదతి | అతడు చెప్పినదే చెప్పుచున్నాడు |
| అన్యథా బహు కష్టం | లేకపోతే చాలా కష్టం |
| కిమర్థం పూర్వం న ఉక్తవాన్ ? | మొదటనే ఎందుకు చెప్పలేదు ? |
| స్పష్టం న జానామి | నాకు స్పష్టంగా / ఇదమిత్థంగా తెలియదు |
| నిశ్చయః నాస్తి | నిశ్చయం లేదు |
| కుత్ర ఆసీత్ భవాన్ ? | నీవు ఎక్కడ ఉండినావు ? |
| భీతిః మాస్తు | భయం వద్దు |
| భయస్య కారణం నాస్తి | భయానికి కారణమే లేదు / భయంలేదు |

| | |
|---|---|
| తదహం బహు ఇచ్ఛామి | అది నాకు చాలా ఇష్టం |
| కియత్ లజ్జాస్పదమ్ ! | ఎంత సిగ్గుచేటు ! |
| సః మమ దోషః న | అది నా తప్పు కాదు |
| మమ తు అక్షేపః నాస్తి | నాకు అభ్యంతరం లేదు |
| సః శీఘ్రకోపీ | అతడు శీఘ్రకోపి / అతడికి కోపం త్వరగా వస్తుంది |
| తీవ్రం మా పరిగణయతు | తీవ్రంగా (సీరియస్‌గా) తీసుకోకు |
| ఆగతః ఏషః వరాకః | ఈ అభాగ్యుడు వచ్చాడు |
| యుక్తే సమయే ఆగతవాన్ | సరైన సమయానికి వచ్చినాడు |
| బహు జల్పితః భోః | అతడు వాగుడుకాయండి |
| ఏషా కేవలం కింవదంతీ | ఇది కేవలం పుకారు |
| కిమపి న భవతి | ఏమీ జరగదు / కాదు |
| ఏవ మేవ ఆగతవాన్ | ఊరకనే వచ్చినాను |
| వినా కారణం కిమర్థం గంతవ్యమ్ ? | ఏమి కారణం లేకుండా ఎందుకు వెళ్ళవలెను ? |
| భవతః వచనం సత్యమ్ | నీవు చెప్పినది నిజమే |
| మమ వచనం కః శృణోతి ? | నామాట ఎవరు వింటారు ? |
| తదా తత్‌న స్ఫురితమ్ | అప్పుడు నాకు అది స్ఫురించలేదు |
| భవతః కిం కష్టమ్ అస్తి? | నీకు ఏమి ఇబ్బంది ఉన్నది ? |

| | |
|---|---|
| ఛ, ఏవం న భవితవ్యం ఆసీత్ | ఛా, అలా జరగకుండా ఉండవలసింది |
| అన్యథా న చింతయతు | మరోలా అనుకోకు |

## మిత్రమేలనమ్ — మిత్రులను కలుసుకొన్నప్పుడు

| | |
|---|---|
| నమో నమః | నమస్కారం / నమస్తే |
| కిం భోః, దర్శనమేవ నాస్తి | ఏమిటి ? ఎక్కడా కనబడుటయే లేదు |
| నైవ, అత్రైవ సంచరామి కిల ? | కనబడక పోవటమేమిటి ? ఇక్కడే తిరుగుతూ ఉన్నానే |
| కిం భోః, వార్తా ఏవ నాస్తి ? | ఏమిటి ? ఎక్కడా కబురే లేదు ? |
| కిం భోః ఏకం పత్రం అపి నాస్తి | ఏమిటి ? ఒక్క ఉత్తరమైనా వ్రాయలేదేమి |
| అస్మాన్ సర్వే విస్మృతాః వా ? | మమ్మల్నందరినీ మరిచిపోయినావా? |
| కథం విస్మరణం భవతి భోః | మిమ్ములను ఎలా మరిచిపోతాను ? |
| భవతః సంకేతం ఏవ న జానామి | మీ చిరునామే (ఎడ్రస్) తెలియదు |
| మహాజనః సంవృత్తః భవాన్ | నీవు గొప్ప / పెద్దవాడివైనావులే |
| భవాన్ ఏవవా! దూరతః న జ్ఞాతమ్ | మీరేనా ! దూరం నుండి గుర్తుపట్టనే లేదు |
| హ్యః భవంతం స్మృతవాన్ | నిన్న నీవు నాకు జ్ఞాపకం వచ్చావు |
| కిం అత్ర ఆగమనమ్ ? | ఏమిటి ఇలా వచ్చారు ? |

| | |
|---|---|
| అత్రైవ కించిత్ కార్యం అస్తి | ఇక్కడే కొంచెం పని ఉన్నది |
| త్వరితం కార్యం ఆసీత్, | కొంచెం తొందరపని ఉండినది |
| అతః ఆగతవాన్ | అందుకని వచ్చినాను |
| బహు కాలతః ప్రతీక్షాంకరోమి | చాలా కాలం నుండి ఎదురు చూస్తున్నాను |
| యానం న ప్రాప్తం, | బస్సు దొరకలేదు, అందుకనే |
| అత ఏవ విలంబః | ఆలస్యం అయింది |
| ఆగచ్ఛంతు భోః, | |
| గృహం గచ్ఛామః | రండి, ఇంటికి వెళ్ళుదాం/ పోదాం |
| ఇదానీం వా ? | ఇప్పుడా ? సమయం లేదండి |
| సమయః నాస్తి భోః | |
| శ్వః సాయం మిలామః వా ? | రేపు సాయంత్రం కలుసుకుందామా? |
| అవశ్యం తత్రైవ ఆగచ్ఛామి | తప్పకుండా అక్కడికే వస్తాను |
| ఇదానీం కుత్ర ఉద్యోగః? | ఇప్పుడు ఎక్కడ ఉద్యోగం చేస్తున్నారు ? |
| యంత్రాగారే ఉద్యోగః | ఫాక్టరీలో ఉద్యోగం చేస్తున్నాను |
| గ్రామే అధ్యాపకః అస్మి | ఊరిలో ఉపాధ్యాయునిగా ఉన్నాను |
| ఇదానీం కుత్ర వాసః? | ఇప్పుడు ఎక్కడ ఉంటున్నారు ? |
| ఏషః మమ గృహసంకేతః | ఇది మా యింటి చిరునామా |
| యానమ్ ఆగతమ్, ఆగచ్ఛామి | బస్ వచ్చినది, వస్తాను |
| అస్తు, పునః పశ్యామి | సరే, మళ్ళీ కలుద్దాం |

| | |
|---|---|
| పునః అస్మాకం మేలనం కదా ? | మళ్ళీ మనం ఎప్పుడు కలవటం ? |
| పునః కదా మిలతి భవాన్ ? | మళ్ళీ మీరు ఎప్పుడు కలుస్తారు ? |
| తత్ దినే కిమర్థం భవాన్ న ఆగత వాన్? | ఆరోజు నీవు ఎందుకు రాలేదు ? |
| వయం ఆగతవంతః ఏవ | మేము వచ్చేశాము |
| భవతః సమీపే సంభాషణీయం అస్తి | నీతో మాట్లాడవలసినది ఉన్నది |
| భవాన్ అన్యథా గృహీతవాన్ | నీవు మరొకలాగా / పొరపాటుగా అనుకొన్నావు |
| భవంతం బహు ప్రతీక్షితవాన్ | నీ కొరకు చాల (సమయం) ఎదురు చూచినాను |
| బహుకాలతః తస్య వార్తా ఏవ నాస్తి | చాలా కాలం నుండి అతనిని గురించి కబురే లేదు |
| భవతః పత్రమ్ ఇదానీ మేవ లబ్ధమ్ | నీ ఉత్తరం ఇప్పుడే అందినది |
| కించిద్దూరం అహమపి ఆగచ్ఛామి | కొంచెందూరం నేను కూడా (మీతో) వస్తాను |
| మిలిత్వా గచ్ఛామః | కలిసి వెళ్దాం |
| తిష్ఠతు భోః అర్ధార్ధం కాఫీం పిబామః | కూర్చోండి / ఉండండి / సగం సగం (బైటూ) కాఫీ తాగుతాము |
| అస్తు, పిబామః | సరే, తాగుదాం |

| | |
|---|---|
| స్థాతుం సమయః నాస్తి | ఉండుటకు (ఆగుటకు) సమయంలేదు |
| గమనాత్ అనుక్షణ మేవ పత్రం లిఖతు | వెళ్ళగానే ఉత్తరం వ్రాయి |
| పునః కదాచిత్ పశ్యామి | మళ్ళీ ఎప్పుడైనా కలుదాం |
| యదా కదా వా భవతు, అహం సిద్ధః | ఎప్పుడైనా సరే, నేను సిద్ధమే |
| తేభ్యః మమ శుభాశయాన్ నివేదయతు | అతనికి/వారికి మా శుభాకాంక్షలు తెలియజేయండి |
| కిం భోః ఏవం వదతి? | ఏమిటి? అలా అంటున్నాడు ? |
| కించిత్ కాలం తిష్ఠతు | కొంచెం సేపు ఉండండి |
| భవాన్ ఏవ పరిశీలయతు | నీవే ఆలోచించు |
| అత్ర పత్రాలయః కుత్ర ఆస్తి? | ఇక్కడ పోస్టాఫీసు ఎక్కడ ఉన్నది? |
| కియద్దూరే అస్తి ? | ఎంత దూరంలో ఉన్నది ? |
| విత్తకోశః కియద్దూరే అస్తి? | బాంక్ ఎంత దూరంలో ఉన్నది ? |
| కిమర్థం ఏవం త్వరా (సంభ్రమః) | ఎందుకు అంత త్వర / గందరగోళం ? |
| ఇతోఽపి సమయః అస్తి కిల ? | ఇంకా సమయం ఉన్నది కదా ? |
| సర్వస్య అపి మితిః భవేత్ | ప్రతిదానికి మితి ఉండాలి. |
| కియత్ ఇతి దాతుం శక్యమ్ ? | ఎంతని ఇవ్వగలను |
| కస్మిన్ సమయే ప్రతీక్షణీయమ్ ? | ఎప్పుడు (ఏ సమయంలో) ఎదురుచూడను ? |

| | |
|---|---|
| గృహే ఉపవిశ్య కిం కరోతి ? | ఇంటిలో కూర్చొని ఏమిచేసెదవు ? |
| భవతః పరిచయః ఏవ న లబ్ధః | మీ పరిచయమే కాలేదు |
| కిం భోః బహు కృశః జాతః ? | ఏమి? చాలా చిక్కిపోయినావు ? |
| అవశ్యం మమ గృహం ఆగంతవ్యమ్ | తప్పక మాయింటికి రావలసింది |
| సః సర్వత్ర దర్పం చాలయతి | అతడు అన్నిటిలోనూ కలుగ జేసుకుంటాడు |
| యథా భవాన్ ఇచ్ఛతి | మీరు చెప్పినట్లే / మీ యిష్టానుసారమే |
| పరిహోసాయ ఉక్తవాన్ భోః | తమాషాకు అన్నానండి |
| ఏషః భవతః అపరాధః న | ఇది మీ తప్పుకాదు |
| నైన, చింతా నాస్తి | లేదు పరవాలేదు |
| వయం ఇదానీం అన్యద్ గృహేస్మః | మేము మరొక యింటిలో ఉంటున్నాము/ (మేము యిల్లు మారినాము) |
| భవాన్ మమ అపేక్షయా జ్యేష్ఠః వా? | నీవు నాకంటే పెద్దవాడవా ? |
| ఓహో, మమ అపేక్షయా కనిష్ఠః కిల? | ఓ! నీవు నాకంటె చిన్నవాడవు కదా ? |
| భవాన్ వివాహితః వా? | నీవు వివాహితుడవా? |
| నైవ, ఇదానీమపి ఏకాకీ | లేదు, ఇప్పుడు కూడా ఏకాకినే |
| భవతః పితాకుత్రకార్యం కరోతి ? | మీ తండ్రి ఎక్కడ పనిచేస్తున్నారు ? |

| | |
|---|---|
| సః వర్షద్వయాత్ పూర్వమేవ నివృత్తః | ఆయన రెండు సంవత్సరాల క్రితమే రిటైర్ అయినాడు |
| సః వృద్ధ ఇవ భాతి | ఆయన వృద్ధునివలె కనబడుతున్నారు |
| భవంతః సర్వే సహైవ వసంతి వా? | మీరు అందరూ కలిసే ఉంటున్నారా ? |
| నైన, సర్వే విభక్తాః | లేదు, అందరం విడిపోయినాము |
| భవతః వయః కియత్ ? | మీ వయస్సు ఎంత ? |
| భవంతః కతి సహోదరాః? | మీరు ఎంతమంది అన్నదమ్ములు? |
| వయం ఆహత్య అష్టజనాః | మేము అంతా కలిసి ఎనిమిదిమందిమి |
| భవాన్ ఏవ జ్యేష్ఠః వా ? | నీవే పెద్దవాడవా? |
| మమ ఏకః అగ్రజః అస్తి | నాకు ఒక అన్నగారు ఉన్నారు |
| సః ఇదానీమపి బాలః | అతడు ఇప్పటికి కూడా బాలుడే |
| భవతః అనుజాయాః కతివర్షాణి? | మీ చెల్లెలికి ఎన్ని ఏండ్లు? |
| భవాన్ మా దదాతు, మా స్వీకరోతు | మీరు ఇవ్వనూ వద్దు తీసుకోనూవద్దు |
| అన్యం కమపి న పృచ్ఛతు | వేరే ఎవరినీ అడుగవద్దు |
| తర్హి సర్వం దాయిత్వం భవతః ఏవ, | అయితే అంతా మీదే బాధ్యత |
| సర్వత్ర అగ్రే సరతి | అంతటాముందుఉంటాడు/ అన్నిటి లోనూ చొరవ తీసుకుంటాడు |

| | |
|---|---|
| భవంతం గృహే ఏవ పశ్యామి | నిన్ను (మీ) ఇంటిలోనే చూస్తాను |
| సః నిష్ఠావాన్ | అతడు నిష్ఠాపరుడు |
| యావదహం ప్రత్యాగచ్ఛామి తావద్ ప్రతీక్షాం కరోతు | నేను వచ్చేవరకు వేచియుండు |
| ద్వయోః ఏకః అగచ్ఛతు | మీ ఇద్దరిలో ఒకరు రండి |
| తస్య కృతే విషయః నివేదితః వా? | అతనికి విషయం చెప్పినావా ? |
| తస్య సః అత్యంతం ప్రీతిపాత్రమ్ | అతడు అతడికి చాలా కావలసినవాడు |
| భవతా ఏతత్ న కర్తవ్యమ్ | మీరు ఇది చేయకూడదు |
| యది సః స్యాత్ ........ | అతడు ఇక్కడ ఉండే ... |
| అవశ్యం ఆగంతవ్యం, న విస్మర్తవ్యం | తప్పక రావలసింది, మర్చిపోవద్దు |
| కియత్ కాలం తిష్ఠతి? | ఎంతసేపు ఉంటాడు / ఉంటావు ? |
| ఏషా వార్తా మమ కర్ణ మపి అగతా | ఈ విషయం నా చెవిని కూడా పడింది. |
| సః స్తోకాత్ ముక్తః | అతడు వెంట్రుక వాసిలో తప్పించుకున్నాడు |
| భవంతం ద్రష్టుం సః పునః ఆగచ్ఛతి కిల? | అతడు నిన్ను చూచుటకు మరల వస్తాడు కదా ? |
| అహం కిమర్థం అసత్యం వదామి ? | నేను అబద్ధం ఎందుకు చెపుతాను ? |
| భవాన్ అపి ఏవం వదతి వా ? | నీవు అలాగే (అందరి వలెనే) అంటున్నావా ? |
| భవాన్ ఏవం కర్తుం అర్హతివా? | నీవు ఇలా చేయగలవా ? |

| | |
|---|---|
| భవాన్ గచ్ఛతు మమ కించిత్ కార్యం అస్తి | నీవు వెళ్ళు, నాకు కొంచెం పని ఉన్నది |
| వృథా భవాన్ చింతాం కరోతి | నీవు ఊరికే చింతిస్తున్నావు / విచారిస్తున్నావు |
| దైవేచ్ఛా తథా ఆసీత్ కిం కుర్మః | దైవేచ్ఛ అలా ఉన్నది, ఏమి చేయగలం ? |
| అహం అన్యద్ ఉక్తవాన్ భవాన్ అన్యద్ గృహీతవాన్ | నేను ఒకటి అంటే నీవు మరొకలాగ తీసుకున్నావు |
| ఏతావద్ అనృతం వదతి ఇతి న జ్ఞాతవాన్ | ఇంత అబద్ధం చెపుతాడని నేను అనుకోలేదు |
| ప్రమాదతః సంవృత్తమ్ న తు బుద్ధ్యా | పొరపాటుగా జరిగినదే కాని బుద్ధి పూర్వకంగా అయినది కాదు |
| ఏషః ఏకః శనిః | వీడొక శని |
| భవదుక్తం సర్వం అపి అంగీకర్తుం న శక్యమ్ | నీవు చెప్పినదంతా అంగీకరించటం సాధ్యం కాదు |
| అహం గంతుం న శక్నోమి | నేను వెళ్ళలేను |
| విషయస్య వర్ధనం మాస్తు | ఈ విషయాన్ని పొడిగించవద్దు |
| సర్వే ఽపి పలాయనాశీలాః | అంతా పలాయనశీలురే |
| సర్వస్య అపి భవాన్ ఏవ మూలమ్ | దీని కంతటికి నీవే కారణం |

| | |
|---|---|
| సులభతయా తస్య జాలే పతితవాన్ | తేలికగా అతని వలలో పడినాడు |
| అస్మాకం మిలనానంతరం బహు కాలః అతీతః | మనం కలిసి చాలాకాలం అయింది |
| ఇదానీం ఆగంతుం న శక్యతే | ఇప్పుడు రావటానికి వీలుకాదు |
| భవాన్ అపి విశ్వాసం కృతవాన్ వా ? | నీవూ నమ్మినావా ? |
| సః విశ్వాసయోగ్యోవా ? | అతడు నమ్మదగిన వాడేనా ? |
| కించిత్ సాహాయ్యం కరోతి వా ? | కొంచెం సహాయం చేస్తావా ? |
| సమయః కథం అతిశీఘ్రం అతీతః | కాలం ఎంత త్వరగా గడిచిపోయింది ! |
| యుక్తే సమయే ఆగతవాన్ | సరైన సమయానికి వచ్చినావు |
| ఏకని మేష విలంబః చేత్ | ఒక నిమిషం ఆలస్యం అయితే |
| అహం గచ్ఛామి స్మ | నేను వెళ్ళిపోయి వుండేవాడిని |
| అహమపి భవతా సహ ఆగచ్ఛామి వా ? | నేనూ కూడా నీతో రానా ? |
| కించిత్ కాలం ద్విచక్రికాం దదాతి వా? | కొంచెం సేపు సైకిలు ఇస్తావా ? |
| ఇదానీం మయా అపి అన్యత్ర గంతవ్యం | నేను కూడా ఇప్పుడు మరొకచోటికి వెళ్ళాలి |
| భవాన్ స్వకార్యం పశ్యతు | నీ పని నీవు చూచుకో |
| శీఘ్రం ప్రత్యాగచ్ఛామి | త్వరగా తిరిగి వస్తాను |

| | |
|---|---|
| ఆవశ్యకం చేత్ ఆనయామి శ్వః | అవసరమైతే రేపు తీసుకుని వస్తాను |
| 'మాస్తు' ఇత్యుక్తోపి సః న శృణోతి | వద్దన్నా అతడు నా మాట వినడు |

## ప్రయాణమ్ / ప్రయాణం

| | |
|---|---|
| చీటికాం కుత్ర క్రీణామి ? | టికెట్ ఎక్కడ కొనుక్కోవాలి ? |
| శీఘ్రం ఆగచ్ఛతు, యానం గచ్ఛతి | త్వరగా రా, బస్ బయలు దేరుతున్నది |
| ఇదానీం ఏవ ఏకం యానం గతం | ఇప్పుడే ఒక బస్ వెళ్ళి పోయింది |
| అహం భవతః పార్శ్వే ఉపవిశామి | నేను నీ ప్రక్కనే కూర్చొంటాను |
| కించిత్ సమజనం కుర్మః | కొంచెం సర్దుకుందాము |
| మహాన్ జనసమ్మర్దః | ఎంత జనసమ్మర్దం |
| పరివర్తం దదాతు | చిల్లర యివ్వు |
| అగ్రే గచ్ఛతు | ముందుకు వెళ్ళు |
| కదా వా నిర్గచ్ఛతి | ఎప్పుడు బయల్దేరుతుంది |
| శీఘ్రం అవతరతు | త్వరగా దిగు |
| అగ్రిమం నిస్థానం అస్మాకం వా ? | వచ్చేది మన స్టేషనేనా ? |
| మల్లేశ్వర యానస్య కా సంఖ్యా ? | మల్లేశ్వరం వెళ్ళే బస్ నంబరు ఎంత |
| కిం సంఖ్యాకం యానం జయ నగరం గచ్ఛతి ? | ఎన్నో నెంబరు బస్ జయనగరం వెళుతుంది ? |
| ఫలకమపి నాస్తి, కిమపి నాస్తి | నంబరు బోర్డూలేదు ఏమీ లేదు |
| అయే, పాదపథే ఆగచ్ఛతు ! | అరే, ఫుట్ పాత్ మీదకు రా |

| | |
|---|---|
| మల్లేశ్వరం గంతుం కః మార్గః ? | మల్లేశ్వరం వెళ్ళడానికి దారిఏది ? |
| బహు దూరే అస్తి వా ? | చాలా దూరంలో ఉందా ? |
| ఏషః సంకేతః కుత్ర ఇతి జానాతి వా ? | ఈ చిరునామా (స్థలం) ఎక్కడో తెలుసా? |
| ఇతః కేవలం దశనిమేషాణాం గమనమ్ | యిక్కడి నుండి కేవలం పదినిమిషాల నడక |
| యానం న లబ్ధం | బస్ అందలేదు / తప్పి పోయింది |
| యానస్య నిర్గమనాయ ఇతోఽపి అర్ధఘంటా అస్తి | బస్ బయలు దేరటానికి యింకా అరగంట ఉంది. |
| యానం దశవాదనే ఆగచ్ఛతి | బస్ 10 గంటలకు వస్తుంది |
| పంచవాదనే ఏకం యానం అస్తి | 5 గంటలకు ఒక బస్ ఉంది |
| యానం తదానీం ఏవ ఆగత్యస్థితం | బస్ అప్పుడే వచ్చి ఉన్నది |
| ఆరక్షణం నాస్తి | రిజర్వేషన్ లేదండీ / లేదు |
| ఏవ మేవ అగ్రే గచ్ఛతు | యిలాగే ముందుకు వెళ్ళండి |
| అత్రైవ కుత్రచిత్ స్యాత్ అన్వేషణం కుర్మః | ఇక్కడే ఎక్కడో ఉంటుంది వెతుకుతాము |
| తత్రైవ అస్తి / తత్రైవ స్యాత్ | అక్కడే ఉంది / అక్కడే ఉంటుంది |
| అహం న జానామి, అన్యం పృచ్ఛతు | నాకు తెలియదు, మరొకరినిఅడుగు |
| భవాన్ శీఘ్రం న ఆగచ్ఛతి చేత్ యానం న మిలతి | మీరు త్వరగా రాకపోతే బస్ దొరకదు |
| ఏషః మార్గః కుత్ర గచ్ఛతి ? | ఈ దారి ఎక్కడకు వెళ్తుంది ? |

| | |
|---|---|
| భవాన్ అరక్షణం కృతవాన్ వా ? | నీవు రిజర్వేషన్ చేసుకొన్నావా ? |
| కృపయా సర్వబంధకం స్వీకరోతు | దయచేసి మీ హోల్డార్ తీసుకోండి |

| | | | |
|---|---|---|---|
| స్యూతమ్ | సంచి | ఏతద్ | ఇది |
| చీటికాం | టికెట్ | యానస్యూతమ్ | ప్రయాణపు సంచి |
| యానపేటికామ్ | సూట్‌కేస్ | వనితా స్యూతమ్ | వానిటీబాగ్ |

| | |
|---|---|
| ధనవిషయే జాగరూకో భవతు | డబ్బు విషయంలో జాగ్రత్తగా ఉండు |
| తతః ఆగంతుం ఏతావాన్ విలంబః వా ? | అక్కడ నుండి రావటానికి ఇంత ఆలస్యమా ? |
| ఏకం అపి యానం న ఆగతమ్ | ఒక్క బస్ కూడా రాలేదు |
| షష్టి సంఖ్యాకం యానం గతం వా ? | 60వ నంబరు బస్ వెళ్ళిపోయినదా |
| అహం ఇదానీం ఏవ ఆగతవాన్ | నేను ఇప్పుడే వచ్చాను |
| కీదృశః మార్గః అయం ! | ఏమి దారి (రోడ్డు) యిది ! |

## ప్రవాసతః ప్రతినివర్తనం — ఊరినుండి తిరిగి వచ్చినపుడు

| | |
|---|---|
| కదా ఆగతవాన్ ? | ఎప్పుడు వచ్చినావు ? |
| అద్య ప్రాతః ఆగతవాన్ వా ? | ఈ ఉదయం వచ్చినావా ? |
| కథం అసీత్ ప్రవాసః ? | ప్రయాణం ఎలా ఉండింది ? |
| ప్రవాసే వ్యవస్థా సమీచీనా ఆసీత్ వా ? | ప్రవాసం / **(Tour)** లో ఏర్పాట్లు బాగున్నాయా ? |

| | |
|---|---|
| కతి దినానాం .......... ? | ఎన్ని రోజులది ..... ? |
| ఏకాకీ గతవాన్ వా ? | ఒక్కడివే వెళ్ళినావా ? |
| ఏకాకీ కిమర్థం ? పరివారసమేతః గతవాన్ | ఒక్కడినే ఎందుకు? కుంటుంబంతోనే వెళ్ళినాను |
| దినత్రయం తత్ర స్థితవాన్ | అక్కడ 3 రోజులు ఉన్నాను |
| మార్గమధ్యే అపఘాతః అభవత్ | దారిలో ప్రమాదం **(Accident)** జరిగింది |
| విశేషతయా కోఽపి న వ్రణితః | ఎక్కువగా ఎవరికి గాయాలు తగులలేదు |
| వస్తూని తావంతి ఏవ వా ? | సామాన్లు అంతేనా ? |
| బహూధా శ్రాంతః అస్మి భోః | చాలా అలిసి పోయినానండి |
| త్రిచక్రికా కిమర్థం? | రిక్షా ఎందుకు ? |
| లోక యానేన గచ్ఛామః | బస్‌లో వెళ్దాం |

| | | | |
|---|---|---|---|
| లోక యానేన | బస్‌లో; | త్రిచక్రికాయాం | రిక్షాలో |
| సుఖయానేన | లక్జరీ బస్‌లో; | పాదాభ్యాం | నడిచి |
| సామి సుఖయానేన | సెమీలక్జరీ బస్‌లో; | సంలపంతః | మాట్లాడుతున్న వాళ్ళు |

| | |
|---|---|
| కః ప్రతీక్షతే భోః ? | ఎవరు ఎదురు చూస్తున్నారు ? |
| త్రిచక్రికాయాం ఏవ గచ్ఛామః | రిక్షాలోనే వెళ్దాం |

| | |
|---|---|
| కిమర్థం వృథా వ్యయః ఇతి ? | వృథా ఖర్చు ఎందుకు అని ? |
| బహుకాలత ప్రతీక్షాం కరోమి | చాలా కాలంగాఎదురు చూస్తున్నాను |
| కదా ప్రస్థితః ? | ఎప్పుడు బయలు దేరినావు ? |
| కాశీం రామేశ్వరం సర్వం దృష్టవాన్ వా ? | కాశీ రామేశ్వరం అన్నీ చూచినావా |
| కియత్ సుందరం అస్తీతి జానాతి వా? | ఎంత సుందరంగా ఉన్నదో తెలుసా? |
| మహత్ అద్భుతం ! | మహా అద్భుతం ! |
| **ఛాత్రా :** | **విద్యార్థులు** |
| అత్రైవ కలాశాలాయాం పఠామి | యిక్కడే కళాశాలలో చదువుతున్నాను |
| సిద్ధతా కథమ్ అస్తి | పరీక్షలకు ప్రిపరేషన్ ఎలా వుంది ? |
| పాఠ్యభాగః ఏవ న సమాప్తః | పాఠాలే పూర్తికాలేదు |
| గణిత శ్రవణ మాత్రేణ మమ శిరోవేదనా | లెక్కల పేరు వింటేనే నాకు తలనొప్పి |
| గాఢం అభ్యాసః వా ? | బాగా కష్టపడి చదువుతున్నావా ? |
| అద్య కిమపి న పఠితవాన్ ఏవ | యివాళ ఏమీ చదువనే లేదు |
| మమ అక్షరాణి న సుందరాణి | నా వ్రాత (దస్తూరి) బాగుండదు |
| ఏతాం కాదంబరీం పఠితవాన్ వా ? | ఈ కాదంబరిని చదివినావా ? (నవలను) |

| | |
|---|---|
| బహు సమ్యక్ అస్తి | చాలా బాగున్నది |
| బహు పూర్వమేవ పఠితవాన్ | చాలా కాలం క్రితమే చదివినాను |
| శీఘ్రం పఠిత్వా దదామి భోః | త్వరగా చదివి ఇచ్చేస్తాను |
| అద్య ఉత్థానే విలంబః సంజాతః | ఇవాళ లేవటం ఆలస్యం అయింది |
| అహం గృహే ఏవ త్యక్త్వా ఆగతవాన్ | నేను ఇంట్లోనే వదిలి వచ్చాను |
| అద్య తు విరామః | ఈ రోజు సెలవు |
| భవతః వర్గశిక్షకః కః ? | మీ తరగతి ఉపాధ్యాయుడు (Class Teacher) ఎవరు? |
| అద్యయ సమవస్త్రేణ గంతవ్యం వా? | ఈ రోజు సమవస్త్రం (uniform) వేసుకుని వెళ్ళవలెనా? |
| యావత్ శాలాం గతవాన్ తావత్ ఘంటా తాడితా | (నేను) పాఠశాలకు వెళుతూనే గంట కొట్టినారు |
| శ్రీమన్, అంత: ఆగచ్ఛామి వా ? | నేను లోపలి రావచ్చునా అండీ? |
| శ్రీమన్, విశేషకక్ష్యాం స్వీకరోతి వా? | ప్రత్యేక తరగతి (Special Class) తీసుకొంటూరండీ? |
| లేఖనీం ఏకవారం దదాతి వా? | (మీ) పెన్ ఒకసారి ఇస్తావా ? |
| టిప్పణీం కించిత్ దదాతి వా ? | (మీ) నోట్సు కొంచెం ఇస్తావా ? |
| హ్యః ఏవ గిరీశః స్వీకృతవాన్ | నిన్ననే గిరీశుడు తీసుకున్నాడు |
| అహం తద్దినే వర్గం న ఆగతవాన్ ఆసమ్ | నేను ఆ రోజు తరగతికి వచ్చి ఉండలేదు |
| ఆగచ్ఛంతు భోః క్రీడామః | రండి, ఆడుకొందాము |

పఠనీయం బహు అస్తి భోః — చదువవలసింది చాలా ఉందయ్యా

కిం మమ పఠనీయంనాస్తి వా ? — నాకు చదువవలసింది లేదా ఏమి ?

పదవీ అశీతితమే వర్షే సమాపితా వా? డిగ్రీ 80లో పూర్తి అయినదా!

సమ్యక్ న స్మరామి భోః — బాగా జ్ఞాపకం లేదండీ

తిష్ఠతు, అహం స్మరామి తత్ — ఆగు అది నేను జ్ఞాపకం చేసుకుంటాను

శ్వః ఆరభ్య సహాధ్యయనం కుర్మః — రేపటి నుండి కలిసి చదువుకుందాము

## పరీక్షా — పరీక్ష

పరీక్షారంభః కదా ఇతి జ్ఞాతః వా — పరీక్షలు ఎపుడు మొదలవుతాయో తెలిసినదా ?

ప్రవేశపత్రం స్వీకృతం వా ? — ప్రవేశ పత్రం (Hall ticket) తీసుకున్నావా ?

పరీక్షా అగ్రే గతా — పరీక్షా వాయిదా (Postponed) వేసినారు

వేలా పత్రికా ఆగతా వా ? — సమయ పత్రిక(Time table) వచ్చినదా ?

పరీక్షా కథం ఆసీత్ ? — పరీక్ష ఎలా ఉండింది ?

ప్రశ్న పత్రికా కించిత్ క్లిష్టా ఆసీత్ — ప్రశ్న పత్రిక (questionpaper) కొంచెం కష్టంగా ఉండింది

అతీవ సులభా ఆసీత్ — చాలా సులభంగా ఉండింది

అహం ప్రథమ శ్రేణ్యాం ఉత్తీర్ణః — నేను మొదటి తరగతిలో ఉత్తీర్ణుడనైనాను

| | |
|---|---|
| హ్యః ఫలితాంశః ప్రకటితః | నిన్న ఫలితం ప్రకటించబడినది |
| అంకద్వయేన ప్రథమ శ్రేణీ న లబ్ధా | రెండు అంకాలలో (marks) మొదటి తరగతి రాలేదు |
| ప్రశ్నేషు వికల్పః ఏవః నాసీత్ | ప్రశ్నలలో ఎన్నిక (choice) లేనేలేదు |
| ఫలితాంశః శ్వః జ్ఞాతః భవిష్యతి | ఫలితం రేపు తెలుస్తుంది |
| రమేశః ఉత్తీర్ణః వా ? | రమేశుడు ఉత్తీర్ణుడై నాడా ? |
| ఏకం పత్రం అవశిష్టం ఇతి ఉక్తవాన్ | ఒక పత్రం(paper) ఇంకా ఉందని అనినాడు |
| పఠితం కిమపి న స్మరామి భోః | చదివినది ఏమీ స్మరించలేనండి. |
| ప్రాయః ద్వితీయశ్రేణీ లభ్యేత | బహుశః రెండో తరగతి రావచ్చును |
| అస్మాకం గణే సర్వేపి ఉత్తీర్ణాః | మా తరగతి(batch) లో అందరూ ఉత్తీర్ణులైనారు |
| ప్రతిశతం కతి అంకాః ప్రాప్తాః ? | నూటికి ఎన్ని మార్కులు వచ్చినాయి |

## చలన చిత్రమ్ — చలన చిత్రము

| | |
|---|---|
| మాసే కతి చిత్రాణి పశ్యతి ? | నెలలో ఎన్ని చలనచిత్రాలు చూచెదవు? |
| ద్వివారం త్రివారం వా ? | రెండు లేకపోతే మూడు సార్లు |
| చిత్రమందిరం పూర్ణం ఆసీత్ | చిత్రమందిరం నిండి ఉండినది |
| మహాన్ సమర్దః ఆసీత్ | చాలా జనసమ్మర్దం ఉండినది |
| చీటికా న లబ్ధా వా ? | టికెట్ దొరకలేదా ? |

| | |
|---|---|
| చిత్రం కథం ఆసీత్ ? | చలనచిత్రం ఎలా ఉండినది ? |
| కరముక్తం ఇతి దృష్టవాన్ | పన్నులేదు(Taxfree)అని చూచినాను |
| కః నిర్దేశకః ? | దర్శకుడు ఎవరు ? |
| తర్హి సమీచీనం ఏవ స్యాత్ | అలా అయితే బాగుండే ఉంటుంది |
| కథా సమీచీనా అస్తి | కథ బాగున్నది |
| ఏతద్ ద్వితీయవారం పశ్యన్ అస్మి | ఇది రెండవసారి చూస్తున్నాను |
| ఏకమపి చిత్రం సమ్యక్ నాస్తి | ఒక్క చలనచిత్రము కూడా బాగులేదు |
| పరహ్యః ఏవ దృష్టవాన్ అహం | నేను మొన్ననే చూచినాను |
| కేవలం నిస్సారం జామితా భవతి | బొత్తిగా పట్టులేదు విసుగు పుదుతుంది |
| తర్హి కిమర్థం ద్రష్టవ్యం ? | అలా అయితే ఎందుకు చూడటం ? |
| మయాపి ఏకవారం ద్రష్టవ్యం ? | నేను కూడా ఒకసారి చూడాలి |
| సర్వే మిలిత్వా గతవంతః వా ? | అందరూ కలిసి వెళ్ళినారా ? |
| కేవలం ధనం వ్యర్థం | కేవలం డబ్బు దండుగ |

## శిక్షకః — ఉపాధ్యాయుడు

| | |
|---|---|
| భవతః వేతన శ్రేణీ కా? | మీ వేతన శ్రేణి(PayScale)ఎంత |
| ఇదానీం వేతన శ్రేణీ సమానా కిల? | ఇప్పుడు అంతటా సమానమే కదా |
| ప్రాచార్యస్య ఆదేశం దృష్టవాన్ వా ? | ప్రాచార్యుల(Principal)ఆజ్ఞ చూచినావా ? |
| ఆహో, తత్తు సామాన్యం | ఆ,అది మామూలే |

| | |
|---|---|
| అధి వేతనం లబ్ధం వా ? | అధి వేతనం increment వచ్చినదా ? |
| లిపికం దృష్టవాన్ వా ? | గుమాస్తాను చూచినావా ? |
| ఏవం చేత్ కథం జీవామః ? | ఇలా అయితే ఎలా బ్రతికేది ? |
| మహాన్ కోలాహలః ఇతి శృతవాన్ | చాలా గందరగోళంగా ఉండినదని విన్నాను |
| పత్రికా పఠితా వా ? వేతనం వర్ధితం | పత్రిక చదివారా ? వేతనం పెంచినారు |
| కదా ఆరభ్య అన్వయః ? | ఎప్పటినుండి అమలులోకి వస్తుంది ? |
| ఇదానీం కక్ష్యా అస్తి వా ? | ఇప్పుడు తరగతి ఉన్నదా ? |
| అద్య కక్ష్యాం న స్వీకరోమి ఇతి సూచయతు | ఈ రోజు తరగతి తీసుకొనని సూచించుము |
| ప్రాచార్యః ఆగతః వా ? | ప్రాచార్యులు వచ్చినారా? |
| అస్మిన్ మాసే కతి విరామాః ? | ఈ నెలలో ఎన్ని సెలవులు ఉన్నాయి ? |
| పరశ్వః విరామః అస్తి వా ? | ఎల్లుండి సెలవు ఉన్నదా ? |
| ప్రశ్నపత్రికా సజ్జీకృతా వా ? | ప్రశ్న పత్రిక సిద్ధమైనదా ? |
| అస్మిన్ వర్షే ఫలితాంశః కథం? | ఈ సంవత్సర ఫలితాలు ఎలా ఉన్నాయి ? |
| ఏతావంతః అంకాః కథం లబ్ధాఃఇతి? | (అతనికి) ఇన్ని మార్కులు ఎలా వచ్చినాయి అని |

| | |
|---|---|
| పరీక్షాకాణాం ఔదార్యం ! | పరీక్షకుల ఔదార్యం వలన ! |
| పరీక్షా అన్యా, యోగ్యతా అన్యా | పరీక్ష వేరు, యోగ్యత వేరు |
| మౌల్య మాపనార్థం గచ్ఛతి వా ? | వాల్యుయేషన్ కు వెళ్తున్నారా ? |
| మౌల్య మాపనం కుత్ర ? | వాల్యుయేషన్ ఎక్కడ ? |
| అస్వస్థః అపి ఆగతవాన్ ? | అనారోగ్యంగా ఉన్నా వచ్చాను |
| ఇదానీంతన బాలాః | ఈ కాలపు పిల్లలు / విద్యార్థులు |
| అయే! అత్ర ఆగచ్ఛతు | ఇదిగో! ఇక్కడకు రా |
| గణితస్య అధ్యాపకః అస్తి వా పశ్యతు | గణితోపాధ్యాయుడు ఉన్నాడేమో చూడు |
| తే తు బాలాః కిల ! | వాళ్ళు బాలురే కదా? |
| కిం భోః సమ్యక్ పఠతి కిల ? | ఏమోయ్ ! బాగా చదువుతున్నావు కదా? |
| సంశయః అస్తి చేత్ పృచ్ఛతు | సందేహం ఉంటే అడుగు |
| జ్ఞాతం కిల ? | తెలిసింది కదా ? |
| పునః ఏకవారం వదతు | మళ్ళీ ఇంకొకసారి చెప్పు |
| ఏకం అపి గణితం న కృతవాన్ వా? | ఒక్క లెక్కకూడా చెయ్యలేదా ? |
| ఏవం చేత్ పరీక్షాయాం కిం కరోతి ? | ఇలాగైతే పరీక్షలో ఏమి చేస్తావు ? |
| సేవకం కించిత్ ఆహ్వయతు | సేవకుడిని కొంచెం పిలువు |
| ఘంటా నాదితా వా ? | గంట కొట్టినారా ? |
| టిప్పణీం లిఖంతు | నోట్సు వ్రాసుకోండి |
| ఏకోపి న జానాతి వా ? | ఎవరికీ తెలియదా ? |

